# సమాలోచన



జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక

సంపాదకుడు: విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి.

సంపుటము 11    రాజమహేంద్రవరము 16-5-1988 (1-6-1988)    సంచికలు 14, 15

## ఈ సంచికలో



రాబోవు సంచికలో :– మృచ్ఛకటికంలో హాస్యం. "ఏ మనిషిని వేమ" సమీక్ష. ఉద్యోగంలో శ్రీకృష్ణుడు. వీరభద్రశతక సమీక్ష మొదలైనవి ఉంటాయి.

1, 16 తేదీలలో ప్రచురింపబడును.

చందా : సంవత్సరమునకు రు. 12.00.
అర్ధసంవత్సరమునకు రు. 6.50.    విడిప్రతి 60 పై.

★ సమాలోచన ★

* జాతీయ సాంస్కృతిక పక్షపత్రిక *

సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి

**Retired Telugu Lecturer, V. T. J. College, Rajahmundry·**

# చిలకమర్తివారి ప్రహసనాలు

— డాక్టర్ ఎల్. కె. మల్లేశ్వరరావు, ఎం.ఏ., పిహెచ్.డి.,

పరిహాసప్రధానాలయిన సంభాషణలు అధికంగా కలది ప్రహసనం. భగవత్, తాపస, శాక్యాదులను గూర్చిన హాస్య సంభాషణలతో కూడినదీ, కుత్సితపురుషులతో కూడినదీ, వారి భాషనూ ఆచారాలను యథాతథంగా ప్రదర్శించేదీ, విశిష్ట భావద్యోతకాలయిన కథాఖండాలు, నియతమైన గతి కల ఇతివృత్తం కలదీ, శుద్ధప్రహసనం అని అంటారు. ఇది ప్రహసనాల్లో మొదటి రకం. రెండవది సంకీర్ణప్రహసనం. వేశ్యా, చేట, నపుంసక, విట, ధూర్త, బంధకీలతో కూర్చబడినది సంకీర్ణప్రహసనం. లోకవ్యవహారసిద్ధమయిన వార్త, దంభమూ, ధూర్తుల ప్రతివాదాలు ప్రహసనంలో ఉండాలని నాట్యశాస్త్రం నిరూపిస్తోంది.

పాశ్చాత్యుల సిద్ధాంతం ప్రకారం ప్రహసనం అన్నది తక్కువ తరగతికి చెందిన 'కామెడీ'గా పరిగణించబడ్డది.

*Force may be defined as exagerated comedy, its problem is unlikely and absurd, its action ludicrous and one sided, its manner entirely laughable* అని నార్‌వుడ్ నిర్వచనం కాగా ఎల్లార్డిస్ నికోల్ ప్రహసనలక్షణాలను ఇలా పేర్కొన్నాడు.

*The main characteristics of force are the dependence in it of character and dialogue upon mere situation. This situation more over is of the most exagerated and impossible kind depending upon the coarsest and mudest of improbable incongurties.*

పై నిర్వచనాలను అనుసరించి పాశ్చాత్య విమర్శకులు చెప్పిన ప్రహసన లక్షణాలను ఈవిధంగా క్రోడీకరించవచ్చు. ప్రహసనంలో గంభీరమైన ఇతివృత్త నిర్మాణం, పాత్రపోషణవంటి లక్షణాలకన్న ఆయా పాత్రల వాక్కులు, చేష్టలు వికారాలను చూపే సంఘటనలకే ప్రాధాన్యం కలిగివుంటాయి. ఆ పాత్రలుకూడా ధూర్తపాత్రలు. లోకస్వభావమయిన ఆచారవ్యవహారాలు ఇందులో ప్రతిబింబింపబడతాయి అని ప్రాచ్యుల అభిప్రాయం. అయితే యథాతథంగా వుండే ఆచారవ్యవహారాలకన్న అతిశయోక్తులకే ప్రాధాన్యమని పాశ్చాత్యుల అభిప్రాయం. కుత్సితమయిన ధూర్తుల వికారాలు, దంభసమన్వితమయిన లోకవ్యవహారం ముఖ్యం అన్న విషయంలో రెండు సిద్ధాంతాలు ఏకీభవిస్తున్నాయి. ఈ లక్షణాలను ప్రహసన రచనకు గల లక్ష్యాన్ని సమన్వయించి చూస్తే, సమకాలిక సంఘంలోని చెడును ఎత్తి చూపి, పరిహసించడంద్వారా ఆ చెడును మార్చి, వ్యక్తులలో సత్ప్రవర్తనకు మార్గదర్శకం కాగలిగింది ప్రహసనం అని అనవచ్చు. ఈ దృష్టితో చూస్తే తెలుగుసాహిత్యంలో ప్రహసన రచనలో ప్రధానులయిన వీరేశలింగం, చిలకమర్తి, పానుగంటి వారల ప్రహసనాలు తమ ధ్యేయాన్ని నెరవేర్చుకోగలిగాయని అనడంలో అతిశయోక్తి లేదు.

పై రచయితల ధ్యేయం సంఘసంస్కరణే, అయినప్పటికీ వారివారి రచనల

విధానంలో ఎంతో వైవిధ్యం కనిపిస్తుంది. వీరేశలింగం పంతులుగారు తమ సంఘ సంస్కరణోద్యమానికి దోహదంగా సర్వసాహిత్య ప్రక్రియల్ని మలచుకొన్నవారు. అందువల్ల ఆయన ఒక్కొక్క చోట అతితీవ్రమైన, నిశితమయిన, వైయక్తికమయిన వ్యంగ్యధోరణి ప్రదర్శించారు. ఆయన ప్రహసనాలు సంఘంలోని అవినీతిని ఎంత తీక్ష్ణంగా విమర్శిస్తాయో వాటిని పాటించి ఆదరించే వ్యక్తులను కూడా అంత నిశితంగాను విమర్శిస్తాయి. పానుగంటివారి ప్రహసనరచనలో సంఘవిమర్శకంటె, చెడును ఎత్తిచూపడంకంటె ఆయా అన్యాయాలకు పాల్పడ్డ వ్యక్తుల విమర్శ ఎక్కువగా కనిపిస్తుంది. ఆ విమర్శకూడా అంత నిశితమూ, వ్యంగ్య ప్రధానమూ అయి అవతలివారి గుండెల్లో సమ్మెటపోటులాగ వుంటుంది. కాని చిలకమర్తివారి ప్రహసనరచనలో అటువంటి వ్యక్తిదూషణ మచ్చుకయినా కనిపించదు. ఆయన వెక్కిరింతలలో, వేళాకోళాలలో అవతలివాడిని కించపరుద్దామన్న అభిప్రాయం ఏమాత్రమూ ఉండదు. అవి అన్నీ లలితంగా హాస్యప్రధానంగా ఒక ఆప్తమిత్రుడు అవతలి మిత్రుడి తప్పుల్ని హేళనచేసే పద్ధతిలోనే వుంటాయి. పైగా చిలకమర్తివారు వ్యక్తులకన్న వారు ప్రాతినిధ్యం వహించే సంఘ దురాచారాలకు ఎక్కువ ప్రాధాన్యం చూపి వాటిని విమర్శిస్తారు. సంఘంలో ఆనాడు ఎక్కువగా ఉన్న దంభమూ, అవినీతి, వేశ్యాలోలత్వం, మిథ్యాగౌరవం, మోసంవంటి సార్వకాలిక సార్వజనీన సమస్యలనే ముఖ్యంగా స్వీకరించి విమర్శించారు లకమర్తివారు కాట్టి చిలకమర్తి వారి ప్రహసనాలు ఆప్రక్రియానిర్వచనానికి అతి సన్నిహితంగా ఉంటాయి.

చిలకమర్తివారు వ్రాసిన ప్రహసనాలను రెండు భాగాలుగా చేయవచ్చు. ఆయన రాసిన మొత్తం ఎనభైఅయిదు ప్రహసనాలలో అచ్చంగా ప్రహసనాలుగా పేర్కొనదగినవి కేవలం ఇరవై అయిదు మాత్రమే. ఇరవై వరకూ సంభాషణాత్మకాలు. మిగిలినవి వ్యాసాలు. వాస్తవానికి ఇవి ప్రహసనాలు అనిపించుకోవు. కేవలం ఇవి హాస్యప్రధానమైన వ్యాఖ్యలు మాత్రమే. ఉదాహరణకు సాధారణ సంవత్సర పంచాంగ శ్రవణము, వంటి వాటిని వ్యాఖ్యానాత్మకమయిన హాస్యప్రధానమయిన వ్యాసాలు అనవచ్చు. కేవలం హాస్యప్రధానమయిన వాటిని మినహాయిస్తే, మిగిలిన ప్రహసనాలలో చిలకమర్తివారు నిశితమయిన హాస్యాన్ని పోషించి, వ్యక్తులకు బాధ కలుగకుండా అపహాస్యం చేయడం దృష్టిలో పెట్టుకున్నట్లు కనపడుతుంది. ఛాందసులమీద దాంభికులమీద. ఆడంబరాలకు పోయేవారిమీద. మతంపేరుతో అస్తవ్యస్తంగా ప్రవర్తించేవారిమీద; ఆయన నిశితమయిన విమర్శలు చేశారు.

చిలకమర్తివారు రాసిన కేవలహాస్యాత్మక ప్రహసనాలు స్వల్పమే అయినా కథాసంవిధానంలోను, పాత్రల మనోభావాల వ్యక్తీకరణంలోను అవి ప్రత్యేకతను సంతరించుకొన్నాయనటంలో సందేహం లేదు. ఇలాంటి శ్రద్ధ ప్రహసనాల్లో 'బధిరచతుష్టయ ప్రహసనం' ముఖ్యమైనది. అందులో నలుగురు చెవిటి వాళ్ళు ఒకళ్ళమాటలు ఒకరికి అర్థం కాకుండా మాట్లాడడాన్ని ఎంతో నేర్పుగా పంతులుగారు చూపారు. చెవిటి శంకరప్ప ఆయన భార్య చెవిటి సింగమ్మ మీద అలిగి ఊరు బయట రావిచెట్టుదగ్గర కూర్చుంటే గంగన్న, నల్లసామి వస్తారు. నలుగురూ ఒకరికి అర్థంకాని విషయాలు మరొకరు మాట్లాడుకుంటూ పోవటం ఇందులో ముఖ్యం. ప్రహసనం చివరలో నారాయణరావు అనే బ్రాహ్మణుడు ప్రవేశిస్తాడు. 'దొరికిన ఆవుదూడ కాలు నేను విరగ్గొట్టలేదని శంకరప్ప అంటాడు. కాలు విరిగినా దూడ మంచిదనీ, దానిని ఆయనకు దానమిస్తానంటే తీసుకోలేదని నల్లసామి వాపోవడం చూచి నారాయణ రావు వారిద్దరికీ మంచిమాటలు చెప్పి పంపివేసి ఆ దూడను ఆహరిస్తాడు. "లోకంలో వారగుడని వచ్చిన పేరు గానే వచ్చింది. నాకు వచ్చిన పేరు చచ్చినా పోదు. వాళ్ళిట్లు, వీళ్ళట్లు మాడిపెట్టి ఏరైతే కోర్టుకు లాక్కు పోగా, ఏదోవిధంగా నాజూకుడబ్బులు చేసుకోవడమే ప్రయోజకత్వ" అని నారాయణరావు స్వగతంగా చెప్పుకొనే మాటలతోనే పాత్రస్వభావాన్ని చూపి ఆ మాటలతోనే పాత్రను అపహాస్యం చేశారు పంతులుగారు.

'గయ్యాళి గంగమ్మ ప్రహసనం'లో గయ్యాళి భార్యతో అమాయకుడయిన భర్తపడే కష్టాలు. ఆ గయ్యాళి తన మాటలు చెల్లించుకోడానికి చేసే అమానుష్యపు పనులు వర్ణించబడ్డాయి ఎన్నాళ్ళకో కనిపించిన స్నేహితుణ్ణి ఇంటికి తీసుకొనివస్తే, తన భర్తలేకుండా చూచి ఆ స్నేహితునితో అతనిని అమ్మవారికి బలి ఇవ్వడానికే ఇంటికి అన్యాయంగా ఆహ్వానించాడని ఆమె చెప్తుంది. ఆ మాటలు నమ్మి ఆ స్నేహితుడు తను దొరకకుండా పారిపోతాడు కాని భర్తతో మాత్రం తాను పూజచేసుకునే పాత్రా అను అడిగాడని, ఇవ్వనందుకే కోపం వచ్చి వెళ్ళిపోయాడని కల్పించి చెప్తుంది. భర్త ఆ పాత్రాలను తీసుకొని స్నేహితుడికి ఇవ్వడానికి పరుగెత్తుతాడు. తనను చంపడానికే వస్తున్నాడని భయపడిన ఆ స్నేహితుడూ అతనికి అందకుండా పరుగెత్తుతాడు. గంగమ్మ గయ్యాళితనంలో రెండు రూపులు చూపారు చిలకమర్తి, ఒకటి

స్నేహితుడికి భోజనం పెట్టకుండా పంపడం. రెండోది తన భర్తదగ్గర అమాయికత్వం ప్రదర్శించడం.

'జనాభా నాటకము' చిలకమర్తి రాసిన ప్రహసనాలన్నిటిలోనూ పెద్దది. దేశంలో జనాభాలెక్కలు రాయడం ప్రారంభించిన తొలినాళ్ళలో ఇంటింటికీ తిరిగే ఎన్యూమరేటర్లు పడే పాట్లు ఇందులో వివరంగా వర్ణించబడ్డాయి. ఈ నాటకంలో వివిధ మతస్థులకు వారి వారి వెర్రి మతవిశ్వాసాలను కూడా మెత్తగా విమర్శిస్తారు చిలకమర్తి. తిరుకచ్చినంబి అయ్యవార్లను గురించి రాసేటప్పుడు ఆయన బ్రాహ్మణుడు అని రాస్తే అయ్యవార్లకు కోపంవచ్చి, పదిమందిని పిలిచి, 'చూశారా నేను బ్రాహ్మణుణ్ణట' అంటాడు. 'శ్రీవైష్ణవుడు అని రాయాలంటాడు.

పేర్లు రాయకపోయిన మూడోనాడే పిల్ల చనిపోయిందనీ పేర్లు రాసుకపోవడమే ఆమె చావుకు కారణమనీ ఎన్యూమరేటరును ఒక ముసలమ్మ తిడుతుంది. భోగము రంగసాని ఇంటిలో కనిపించిన తిరుపతిని గురించి రాసుకొనే ఎన్యూమరేటరును తిరుపతి బతిమాలటమూ, భంగపడటమూ చూపటంలో రాత్రి పూట సానికొంపల్లో దూరే పెద్దమనుషుల చేష్టలను దుయ్యబట్టారు పంతులుగారు.

రహీంఖాన్ అనే ఎన్యూమరేటరు బొట్టులేని పిల్లను చూచి, భర్తపేరు అడిగితే 'ఆమె విధవ' అని చెప్ప పక్కనున్న ముసలమ్మ ఏడుస్తుంది. అప్పుడే తలారా స్నానంచేసి వస్తున్న ఒకావిడ మొగం మీద బొట్టు లేకపోవడం చూచి 'ఈమె కూడా విధవేనా' అని అడుగుతాడు రహీంఖాన్. ఈవిధంగా పరస్పరవిరుద్ధమైన ఆచారాలున్న వ్యక్తులు తటస్థపడితే రాగల హాస్యసన్నివేశాలను సృష్టించారు పంతులుగారు.

ఈ హాస్యాత్మకమయిన ప్రహసనాలను మినహాయిస్తే మిగిలినవన్నీ విమర్శనాత్మకాలుగానే చెప్పవచ్చు. ఈవిమర్శలన్నీ సంఘంలోని మతాచారాలను గురించి మిథ్యాగౌరవం గురించి, సంఘంలో జరుగుతున్న అసమంజసమైన వివాహాలను గురించి అందువల్ల ఉత్పన్నమౌతున్న సమస్యలను గురించి చేయబడ్డాయి. 'వరదక్షిణ ప్రహసనం'లోని కటు విమర్శ మొదలుకొని 'బలవంత బ్రాహ్మణార్థం' వంటి సున్నితమయిన విమర్శవరకూ అన్నిరకాల విమర్శనూ పంతులుగారు ఉపయోగించారు.

బ్రాహ్మణుల ఆచార వ్యవహారాలు పూర్వకాలపు నియమనిష్ఠలకు ఎంత దూరంగా ఉన్నాయో చూపుతూ పంతులుగారు ఎన్నో ప్రహసనాలు రాశారు. అందులోనూ ముఖ్యంగా బ్రాహ్మణులు శ్రాద్ధాల విషయంలో చేసే అవకతవక పనులను ఎంతగానో పరిహసించారు. 'బలవంతపు బ్రాహ్మణార్థము'లో ఒక నియోగి ప్రభువుకు తన తల్లి శ్రాద్ధమన్న విషయమే జ్ఞాపకం లేదు. అయినను పురోహితుడు ఆ విషయం జ్ఞాపకం చేస్తే దారినిపోయే ఏ బ్రాహ్మణుణ్ణయినా సరే తీసికొని రమ్మని పెట్టి వాకిలి కాపుకాడు. వాడు ఒక అవధానం చేసిన ఒక శాస్త్రిని తీసుకొని వస్తాడు. తాను అటువంటి బ్రాహ్మణార్థాలు చేయనని మొత్తుకున్నా వినక ఆయనను బెదిరించి తీసుకొని వస్తాడు. ఆ బ్రాహ్మణుడు పురోహితుడి మెడలో యజ్ఞోపవీతం లేకపోవడం చూచి ఏమైందని అడుగుతాడు. పురోహితుడు తెల్లబోయి "ఎంత ప్రమాదం జరిగింది? రాత్రి నల్లమందు వాడికి డబ్బు ఇవ్వకుండా వస్తుంటే భోగం సాని తల్లి, ముసలిముండ జంధ్యం పట్టుకులాగి తెంపి వేసింది. ఆ మాట నేను మరిచేపోయినాను" అనుకొని లాఘవంతో ఈవిధంగా ప్రమాదాన్ని దాటుతాడు. "ఈ తద్దినం ఆ బ్రాహ్మణుడి తల్లిది కనుక అమ్మ తద్దినానికి జంధ్యం అక్కరలేదు" అంటూ పైగా ఆ అవధాని మెడలోని జంధ్యాన్ని కూడా తీసి వేయమంటాడు.

'అద్భుతశ్రాద్ధ ప్రహసనం' ఒకరకంగా బలవంతపు బ్రాహ్మణార్థ ప్రహసనానికి పూరకం అని చెప్పవచ్చు. సదాశివుడి తండ్రిచనిపోతే పిండాల్ని కాకులు ముట్టవు. అప్పుడు అతని మేనమామకు పూనకం వచ్చి అందులో సదాశివుడి తండ్రి తాను బతికివుండగా ఉప్మా కాఫీలు తనకు అలవాటనీ కిలోదక, తిలోదక, వాసోదకాలకు బదులు ఉప్మా కాఫీలతో తర్పణాలు విడువవలసిందంటాడు. దానికి పురోహితుడు ఉప్మా కాఫీ అలవాట్లమీద పెద్ద ఉపన్యాసం ఇస్తాడు. కాఫీలు కాఫీకొట్లు వచ్చిన తర్వాతే రోగాలు ఎక్కువయ్యాయని వాపోతాడు. అయినా తండ్రి మేనమామల ఆజ్ఞ మేరకు సదాశివుడు ఉప్మా కాఫీలు పంచుతాననీ అదే శ్రాద్ధమనీ అంటాడు. ఈవిధంగా కొన్ని మారుతున్న అలవాట్లను, సద్దుబాటు మనస్తత్వాన్నీ విమర్శించారు పంతులుగారు.

సంఘంలో దుస్థితికి వ్యక్తులమధ్య వుండే అసూయ కారణమన్న విషయాన్ని చిలకమర్తివారు ఎన్నో ప్రహసనాలలో తెలియచేశారు. బ్రాహ్మణులలో పరస్పరం వుండే వృత్తివైరుధ్యాన్ని గురించి 'కనక కుసక ప్రహసనం'లో ఆయన అవహేళన చేశారు. ఎందరు తనను సందేహనివృత్తికై సంప్రదించినా రామశాస్త్రి తాను గౌరవించడంలేదని

# "కవితాకళానిధి" డా. కరుణశ్రీకి సన్మానం

—డా. ఆచార్య భావన్

విభవ ఉగాది (18-3-1988) నాడు స్థానిక సాహితీమిత్ర సమాఖ్య 'విజయ భావన' తన తృతీయ వార్షికోత్సవ సందర్భంగా 'కవితాకళానిధి' డా॥ జంధ్యాల పాపయ్యశాస్త్రి (కరుణశ్రీ)ని ఘనంగా సన్మానించింది. జిల్లా సాంస్కృతిక వ్యవహారమండలి తరఫున జిల్లా కలెక్టర్ శ్రీ ఎం.వి.ఎస్. ప్రసాద్ కరుణశ్రీని నూతన వస్త్రాలతో, మెమెంటోతో సన్మానించారు. ఆంధ్రప్రభ-ఇండియన్ ఎక్స్‌ప్రెస్ ఉద్యోగిబృందంతరఫున శ్రీ వి.ఎన్.ఎస్. ప్రసాద్ కరుణశ్రీకి అర్ధ-వెయ్యినూట పదహార్లు నగదు బహూకరించారు. సంస్థ ప్రధానకార్యదర్శి డా॥ ఎ. గోపాలరావు తాను రచించిన 'సువర్ణశ్రీ' నామాంకిత సన్మానపత్రం సమర్పించారు. ఇతర సాహితీ సాంస్కృతిక సంస్థలు, పురప్రముఖులు కరుణశ్రీని ఘనంగా సత్కరించారు. ఈ సన్మానసభకు సంస్థ గౌరవాధ్యక్షులు శ్రీ మారెళ్ళ వెంకటశాస్త్రి అధ్యక్షత వహించారు.

డా॥ కరుణశ్రీ తనకు జరిగిన సన్మానానికి మిక్కిలి సంతృప్తి వెలిబుచ్చి, తన కృతజ్ఞతలు తెలియజేసారు. ఈ సందర్భంగా ప్రసంగిస్తూ డా॥ కరుణశ్రీ పద్యకవిత్వం చాలా విలక్షణమైనదనీ, ఎన్ని యుగాలైనా అది సజీవంగానే కొనసాగుతూనే వుంటుందనీ తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అందమైన భావాల్ని అందంగా చెప్పటం కవులు అలవరచుకోవాలని ఆయన సూచించారు. ఆనందోపదేశాత్మకంగా, సమాజాన్ని ఉత్తేజపరచి, అభ్యుదయమార్గంలో నడిపించే విధంగా రచనలు ఉండాలని ఆయన రచయితలకు విజ్ఞప్తి చేశారు. ఏ భాషాసాహిత్యాలకు లేని ప్రక్రియా వైవిధ్యం, యతిప్రాసల సొగసు మన తెలుగుభాషకు వుండటం గర్వింపదగిన విషయమనీ, తెలుగుభాషాసాహిత్యాల విలువ తగ్గిపోకుండా కాపాడుకోవలసిన బాధ్యత తెలుగుకవులపై వుందని ఆయన సూచించారు. తెలుగు భాష వంటి తీయందనము లేదనీ, తెలుగు కవులవంటి ఘనులు లేరనీ, తెలుగుతల్లి సాధుజనకల్పవల్లి అనీ తన సహజకవితాధోరణిలో తెలుగు భాషాసాహిత్యాల ప్రాశస్త్యాన్ని వివరించారు. మనం నిత్యం సంభాషణల్లో ప్రయోగించే సామెతలు, పొడుపుకథలు తెలుగుభాషకు ఒక ప్రత్యేకమైన సొంపు కలిగిస్తాయనీ, ఇద్దరు తెలుగువాళ్ళు కలుసుకున్నప్పుడు తెలుగులోనే మాట్లాడుకునే రోజు వచ్చినప్పుడు, నిజంగా ఆనాడు 'ఉగాది' మనకు వచ్చినట్లుగా ఆనందించాలని డా॥ కరుణశ్రీ అభిప్రాయపడ్డారు.

బుద్ధభగవానుని అహింసా సిద్ధాంతాన్ని సర్వమానవాళి ఆచరించి, ప్రపంచశాంతిసాధనకు తోడ్పడాలనే వుద్దేశంతో తాను 'కరుణశ్రీ' కావ్యాన్ని రచించినట్లు ఆయన తెలిపారు. అలాగే పరిపాలనలో ఉత్తమ దేశభక్త భావాన్ని నెలకొల్పాలనే ధ్యేయంతో 'విజయశ్రీ' కావ్యాన్ని రచించటం జరిగిందని ఆయన అన్నారు. ఈనాటి బాలలే రేపటి పౌరులు కనుక వారికి క్రమశిక్షణ, సత్ప్రవర్తన, నీతిబోధన కలిగించి, వారిలో తల్లిదండ్రులపై గౌరవం, దైవభక్తి, దేశభక్తి, సోదరప్రేమ, సమైక్యభావన మున్నగు సుగుణాలను అలవాటుచేయటం కోసమే సరళమైన భాషలో, సుకుమారమైన శైలిలో 'తెలుగుబాల' శతకాన్ని బాలలోకానికి కానుకగా అందించినట్లు తెలియజేసారు.

డా॥ కరుణశ్రీ తన 'ఉదయశ్రీ' స్వర్ణోత్సవం జరుపుకున్నా; 'కరుణశ్రీ'; 'విజయశ్రీ' రజతోత్సవాలు జరుపుకున్నా; 'తెలుగుబాల' శతకం లక్షలాది ప్రతులు అమ్ముడుపోయినా అది తెలుగు సాహితీరసజ్ఞుల సహృదయతే అనీ, తాను వారి కెప్పుడూ కృతజ్ఞుడై వుండగలనని వెల్లడించారు. ఈ సందర్భంగా, తన పుష్పవిలాపం; కుంతీకుమారి; అద్వైతమూర్తి; సాంధ్యశ్రీ, అంజలి మున్నగు కవితాఖండికలను ముగ్ధమధుర మనోహరంగా గానం చేసి, విశేషప్రశస్తి ప్రచారాలు కల్పించిన మధురగానకళాతపస్వి, గంభీర కంఠఘనతర యశస్వి, అయిన 'ఘంటసాల'ను స్మరించుకుని ఆయనకు తన నివాళు లర్పించారు. అనాదినుంచి సాహితీవేత్తలను విశేషంగా ఆదరిస్తూ, ఘనంగా సన్మానిస్తున్న విద్యలనగరమైన విజయనగరంలో ఈనాడు 'విజయభావన' విభవవైభవంగా, అత్యంత ఆత్మీయతానురాగాలతో తనకు సన్మానించిన ఈ ఘట్టం తన జీవితంలో మరపురానిదనీ, విజయనగర సాహితీరసజ్ఞుల ఆదరాభిమానాలను తన గుండెల్లో పదిలపరచుకుని ఆనందంగా తిరిగి వెళ్ళుతున్నట్లు క్రిక్కిరిసిన ప్రేక్షకశ్రోతల కరతాళధ్వనుల మధ్య ప్రకటించారు.

నగరంలోని వివిధ పాఠశాలలకు చెందిన విద్యార్థినీవిద్యార్థులకు విజయభావన నిర్వహించిన సాహితీ సాంస్కృతిక పోటీలలో విజేతలైనవారికి డా॥ కరుణశ్రీ ప్రశంసాపత్రాలను, బహుమతులను అందజేసి, సంస్థను ప్రత్యేకంగా అభినందించారు.

చారు. విద్యార్థులను ప్రోత్సహించే కార్యక్రమాలను చేపడుతున్న విజయభావన పట్ల జిల్లా కలెక్టర్ శ్రీ ఎం. వి. ఎస్. ప్రసాద్ కూడ తన హర్షాన్ని వెలిబుచ్చారు. విజయభావన ప్రచురించిన వార్షిక సంచిక 'విభవ' కూడా ఈ సభలో ఆవిష్కరింపబడింది.

సభా ప్రారంభానికిముందు శ్రీకాకుళం జిల్లా, జగ్గన్నాయుడుపేటకు చెందిన ఉపాధ్యాయుడు శ్రీ చేరెళ్ళ నారాయణ మూర్తి కుమారుడు మాదేళ్ళ చిరంజీవి విరజాకుండ్ డా॥ కరుణశ్రీ పద్యాలను అవలీలగా, సభాపిరికితనం లేకుండా చదివి, సభాసదులను ఆనందాశ్చర్యాలలో ముంచెత్తాడు. ఆ చిరంజీవికి డా॥ కరుణశ్రీ పుష్పగుచ్ఛం బహూకరించి, ఆశీర్వదించి, తన ఆనందాన్ని ప్రకటించారు.

ఈ సన్మానసభా కార్యక్రమంలో శ్రీయుతులు పున్నమరాజు నాగేశ్వర రావు, శ్రీరంగం నారాయణరావు, ఎ. ఎల్. ప్రసాదరావు, వి. సత్యనారాయణ ప్రభృతులు అభినందన ప్రసంగాలు చేసారు. ఎన్నో సాహితీసంస్థలు తరచు వివిధ సాహిత్య కార్యక్రమాలు జరుపుతుంటున్న విజయనగరంలో ఒక చక్కని 'వేదిక'ను నిర్మించటంలో జిల్లా కలెక్టర్ అధికారికంగా సహకరించవలసిన అవసరం ఎంతైనా వున్నదని తన ప్రసంగంలో ఆంధ్రపత్రిక ప్రతినిధి శ్రీ శ్రీరంగం నారాయణరావు విజ్ఞప్తి చేశారు. ఉత్సవంలో పాల్గొన్న సాహితీకర్తలకు, పత్రికా ప్రతినిధులకు సంస్థ అధ్యక్షుడు డా॥ ఆచార్య భావన్ జ్ఞాపికలు బహూకరించారు.

ఉగాది ఉదయం సుమారు 25 మంది కవులు, కవయిత్రులతో విజయభావన కవి సమ్మేళనం నిర్వహించింది. ప్రాంతీయ రవాణాశాఖాధికారి శ్రీ కె.వి. రామయ్య అధ్యక్షత వహించిన ఈ కార్యక్రమాన్ని జిల్లా పౌరసంబంధ అధికారి శ్రీ ఎస్. నారాయణరావు జ్యోతి వెలిగించి ప్రారంభించారు. గుంటూరు హిందూ కాలేజీ తెలుగు లెక్చరర్ డా॥ జంధ్యాల జయకృష్ణబాపూజీ (కరుణశ్రీ కుమారుడు) ప్రారంభోపన్యాసం గావించారు. 'విజయ భావన' నామసార్థక్యాన్ని విశ్లేషణాత్మకంగా ఆయన వివరించి, స్వీయకవితాగానం చేసారు. ఈ కార్యక్రమంలో ఇంకా శ్రీయుతులు వి.వి.యస్. పాత్రో, కోరిరాజు సత్యనారాయణ, మూలా పేరన్నశాస్త్రి, కె. వి. సుబ్బయ్య ప్రభృతులు పాల్గొని స్వీయకవితలు చదివారు. కవిసమ్మేళనంలో పాల్గొన్న వారందరికీ, ఆంధ్రప్రభ-ఇండియన్ ఎక్స్‌ప్రెస్ తరఫున శ్రీ కె. బలరామ్ జ్ఞాపికలు బహూకరించారు.

ఈ సందర్భంగా సాంస్కృతిక కార్యక్రమాలు కూడా ప్రదర్శించబడినాయి. సంస్థ సహాయ కార్యదర్శి శ్రీ గంట మురళీధర్ నిర్వహణలో జరిగిన ఈ కార్యక్రమాల్లో శ్రీ గాడవర్తి రాఘవ మహాలక్ష్మీకర్ణ ఏకపాత్రాభినయం చేసారు. చిరంజీవులు విమల, అంజని, మురళీధర్ నృత్యప్రదర్శనలు గావించారు. ప్రొఫెసర్ శ్యామ్ ఇంద్రజాల ప్రదర్శనతో ప్రేక్షకులను విశేషంగా ఆకర్షించారు.

లలిత సంగీత కార్యక్రమంలో శ్రీయుతులు బి. ఆర్. వెంకోజీ, ఎన్. వి. రమణ లలితగీతాలు పాడారు వీరు పాడిన గీతాలలో ఎక్కువగా కరుణశ్రీ గీతాలు వుండటంచేత ఔచిత్యం పాటించబడిందని పలువురు ప్రశంసించారు. ఈ కార్యక్రమంలో శ్రీ రమణమూర్తి తబలాపై, శ్రీ మురళి మృదంగంపై, శ్రీయుతులు వరదరాజాచార్యులు, కృష్ణమూర్తి వయొలిన్‌పై చక్కగా సహకరించి, కార్యక్రమాన్ని రక్తికట్టించారు.

కుమారీమణులు జామరాజా జానకీరాణి, పిడపర్తి సూర్యకాంతం దేశభక్తి గీతాలతో ప్రార్థనచేయగా, సంస్థ ఉపాధ్యక్షులు శ్రీ పి. మోహన్ స్వాగతం పలికారు. కార్యదర్శి శ్రీ వి.వి.యల్. సుబ్బారావు వందన సమర్పణతో వార్షికోత్సవసభలు దిగ్విజయంగా ముగిసాయి.

—•••—

## సింహాచలోత్సవమాల - అడిదము సూరకవి

సేకరణ : 'సాహిత్యకోవిద' శ్రీ ద్వివేది రామం

ఆంధ్రభోజుడైన కృష్ణరాయలచేత గండపెండేరం తొడిగించుకున్న కవి పెద్దన్నగారు ప్రాచీన ఉత్పలమాలతో తులతూగ, గల ఉత్పలమాలికను, 18వ శతాబ్దంలో ఉత్తరాంధ్రలో తన కీర్తిని దశదిశలా విస్తరింపజేసిన అడిదము సూరకవి, సింహాచలోత్సవమాలిక అనే పేరుతో రచించేడు. సూరకవి రచించిన కవిజనరంజన ప్రబంధాన్ని గంటి సూర్యనారాయణ శాస్త్రి గారి సంపాదకత్వాన 19.2 వ సంవత్సరంలో మద్రాసు రామ్‌జయ్ అండ్ కంపెనీ వారు ప్రచురించేరు. విజయనగర సంస్థానాస్థాన కవీశ్వరులైన శ్రీ భోగరాజు నారాయణమూర్తి గారు 1982 లో ప్రచురితమైన కవిజన రంజనానికి పీఠిక వ్రాస్తూ, ఆ పీఠికలో ఈ మాలికను ఉటంకించేరు.

మాలికలో ఆఖరు చరణాలలో ...
'వేంకటకృష్ణరాయ ధాత్రీశ శశాంక మూర్తి వినుతింప గలేంక వె మావిచారములు' అని వుంది. మాలిక చదివిన తరువాత, ఎవరీ వేంకటకృష్ణరాయ ధాత్రీపుడు? అనే ప్రశ్న ఉత్పన్నమౌతుంది. సూరకవి, పెదవిజయరామ మహారాజా, ఆనందగజపతి మహారాజా చిన విజయరామమహారాజాగార్ల కాలంలో అనగా 1720 నుంచి 1785 ప్రాంతంవరకు జీవించేడని శ్రీ అడిదం రామారావు పంతులుగారు అడిదము సూరకవి జీవితము అనే పుస్తకంలో వ్రాసేరు. ఈ వేంకటకృష్ణరాయ ధాత్రీశ్వరు డెవడో పోల్చుకోవడం సమస్యగా తయారైంది. అడిదం సూరప్పకు సుమారు 300 సంవత్సరాల కిందట కరిణీకం నిమిత్తం యర్ర కృష్ణదేవు, వల్లకృష్ణదేవు అనే మహారాజులు ఇనాంభూము లిచ్చి నట్టు శ్రీ రామారావుగారు వ్రాసేరు.
చెరువుమీది పద్యాలలో అడిదం కామకవి,

'వల్లకృష్ణక్షమా నాయకాగ్రేసరుం
డెల్ల కృష్ణక్ష్మాతలేంద్రు లచట
గరణిక ధర్మంబు గల్పించి మాన్యంబు
దయచేసి రది యాస్పదంబు మాకు'

అని చెప్పేడు. ఈ మాలికలో చెప్పబడిన వేంకట కృష్ణరాయ ధాత్రీశుడు వీరి జ్ఞాతి అవుతాడేమో! ఈయన సింహాసనాధీశ్వరుడు కాకపోవడంచేతను, రాజకుటుంబంలో సభ్యుడుమాత్రమే అవడంచేతను ఇతని గురించి లోకానికి ఎక్కువగా తెలియకపోవచ్చును. ఉత్తరాంధ్ర చరిత్రకు సంబంధించి యీ సాహిత్యపరమైన విశేషాన్ని పరిశోధకులు ప్రత్యేకముగా వివరిస్తే సాహిత్యోపాసకులకు కనువిప్పు కలుగుతుంది. ఈ మాలికలో పూర్వభాగంలో తెలుగు ఉత్తరభాగంలో సంస్కృతం అహమహమికాభావంతో శోభిస్తున్నాయి.

## సింహాచలలోకనోత్పలమాల

పైపయి రంగులం గదిసి
పన్నగు భోగశటన్నుకన్నె బెం
పైపనుబద్ధ కబ్బురము
కబ్బురమావెర మాలు తేలు వా
ల్చూపుల ప్రాభులన్ వలపు
లాపుచు నీటుగుమాట లేటలన్
దీపులు పుట్టసెట్టిన బ
దింబడిగా నెడఁబొక్కె చొక్కె పు
లూపచనుంగవం గదిసి
పోడిమి నేడు మిటారపుంగటా
రీ పస మీరువారు జగి
రించెడి మిం చదరంగడంగి, మే
లీ పని యంచు నెంచి మది
హెచ్చుగ మెచ్చుగ నిచ్చవచ్చిన
ట్లోపిన యంతపట్టు బిగి
యాతొగవాతెర మోర్పు సేర్పులన్
దాపగు ముద్దుగుమ్మ గని
తద్దయుగద్దరిపైడి ప్రోదిపెన్
గోపులెతింగి చేయువల
రాయిలకాకల చాయ నింపుసొం
పై పొనరన్ వలెన్ జవుల
నంటినదంతట నాని విచ్చి కన్
మోడిచి పేరు టాకుని గ
నుంగొనగా సొగసైన తేటలన్
దూపెడలించి పెంచడగు
తోరపుగొజ్జగి పూలచాలు తీ
గై పొనరన్ వలెన్ జవుల
నందిన యమ్మురు తేరు దారిలో
బై పవళించు పేడగది
పందిరియందలి పట్టెమంచమం
దా పని ముస్నా బూటక పు
టందము చిందగ నందక త్తెచే
పాపి రెయుసంగు పీడము ప
సన్ వలపుల్ మొలపింపగా వలెన్
దేపక దేత కిప్పగిది
దన్గొనరించెడుపట్లు; సంస్కృతా
టోపము జూపుచో వలి వ
టుంబక ఝాంకరణాంక, కల్పవ
ల్లిపతేల్ల నోల్లసద
లీన, నవీన సదాశపాయ మా
నోకల సత్ప్రభూత పుర
హూతవనీభవ నిగ్గరాజిక
ఛోపరిపుష్ప నిష్పతద
మానమరంద ఝరీపరీత సం
తాప, మారాంబుపూర పరి
తప్పరణోత్థఘాకంఘకధ్వని
వ్యాప్తి సురాపగాంతర స
మగ్రతమగ్రమా నాయక వ్యాపే
ఛా పరిపీన చారుతర
సౌరభ సారశరాలి, భాస్కరా
ప్తా పతకంజపుంజ నిబ
సత్కనకచ్ఛదహంస సంసజా
లాత, కలాప సమ్మిళిత
లాస్యకలాపమోహ కాంచికా
నూపుర రత్నకంకణ వి
నూత్న తరద్యుతి రత్నకంకణ
ప్రాపి ఘణంఘణాక్వణన
రంజిత మంజుల రూపరేఖలై
భీ పరిగీత తార తర
గీతవినూతన జాతమాధురీ
రూపనిరూపణీయములు
రూఢిక నెక్కవలెన్ గవిత్వ వి
ద్యాపటిమం బటంచు, నను
నంతటివాసిగ నెంచి నాదు పు
ణ్యోపచయంబునన్ బిలిచి
యుర్విని సర్వరసజ్ఞు లెన్నజా
లోపని వారు విన్నదవ
మెందగ సన్నిధియందు జేర్చు కృ
ద్వ్యపతి విష్ణుమూర్తి యత
ద్గిరత కీర్ణవితీర్ణ నైపుణా
శాపరిపూర్ణ కీర్తి యన
జాలిన వేంకటకృష్ణరాయ ధా
త్రీపశశాంకమూర్తి
వినుతింతగలేంక వె మావిచారములు.

అముద్రిత గ్రంథ చింతామణిలో యీ మాలిక అడిదము సూరన విరచిత మని ప్రకటింపబడినట్లు భోగరాజువారి పీఠికలో వుంది.

---

# శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారి లేఖ - వార్ధకము

శతావధాని శ్రీ చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారి దగ్గర నామిత్రులు బెజవాడ లోని సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులైన డాక్టరు ఘంటసాల సీతారామశర్మగారు చిన్నప్పుడు మచిలీపట్టణంలో చదువు కున్నారు. శ్రీ శాస్త్రిగారు శర్మగారింటికి తరుచూగా వచ్చేవారు. శర్మగారు వారికి నన్ను పరిచయం చేశారు. శ్రీ శాస్త్రిగారి స్వగ్రామం తూర్పుగోదావరి జిల్లాలోని కడియం. అది పిఠాపురం సంస్థానంలో చేరిన గ్రామం. శ్రీ శాస్త్రి గారు 1870 సం॥లో జన్మించి 1950 సం॥లో దివంగతులైనారు. పూర్వపు పిఠాపురం రాజా గంగాధరరామా రావు గారు 1890 సం॥లో స్వర్గస్థులైనారు. వారి దగ్గర మా పెదతండ్రిగారైన దిగవల్లి వేంకటశివరావుపంతులుగారు 1868-1879 మధ్య చాలాకాలము దివానుగా నున్నారు. శ్రీ శాస్త్రిగారు రాజాగారిని గురించీ, మా పెదతండ్రిగారిని గురించి తమ కథలు గాథలులో చాలా విశేషాలు వ్రాశారు. శ్రీ శాస్త్రిగారికి నామీద చాలా దయ కలిగినది. శాస్త్రిగారు చనిపోయేముందు కొంతకాలము తమ కుటుంబముతో బెజవాడలో బందరు రోడ్డుపైని డాక్టరు క్షీరసాగరుగారు నిర్మించిన కొట్లలో కాపురం వుండేవారు. అప్పట్లో నేను, శర్మగారు, శ్రీ శివరామశాస్త్రిలు గారు ఇంకా వారి ఇతర శిష్యులు వారి దర్శనానికి తరుచుగా వెళ్ళేవారము. శ్రీ శాస్త్రిగారికి 1945, 46 ప్రాంతంలో ఒకమారు జబ్బు చేసి నెమ్మదించినది. అప్పుడు వారు శర్మగారికి ఒక పెద్ద ఉత్తరము వ్రాశారు. అందులో నన్ను గురించి కూడా ఉన్నందువల్ల శర్మగారు నాకును చూపించారు. అందులో శ్రీ శాస్త్రిగారు వార్ధక్యమును గూర్చి, ఆరోగ్యమును గూర్చి రచించిన అపూర్వమైన పద్యాలున్నవి. అవిగాక నేను ప్రకటించిన ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్రను గూర్చికూడా కొన్ని పద్యాలు రచించారు. సమాలోచన పత్రికా పాఠకులు చదువగలందులకు వాటి నిప్పుడు ప్రకటిస్తున్నాను.

—దిగవల్లి వేంకట శివరావు

శ్రీమత్పరదేవతాయై నమః

క్షీరసాగరం,
బెజవాడ.

శ్రీరస్తు చి. డాక్టర్ శర్మకు ఆశీః.

నేను ఈమధ్య నెలనాడు చాలా దూరం ప్రయాణం చేసి తుదకు గమ్యస్థానం చేరక మళ్ళీ వెనక్కి మళ్ళి యథాస్థానంలోనే వున్నాను.

అతిసారమ్ము కతాన, జీవితపు ని
   ర్యాణంబు సిద్ధించు స
త్కృతి యోగీంద్రులకేని దుర్లభముగా
   బుష్యగ్రణుల్ చెప్పరే
జిత పంచేంద్రియులాసచేయు మృతి నా
   చేతిక్కి వక్రించె వి
స్మితమా దక్షిణమూర్తి దైవబల్మి
   బేర్మిన్ జేసి కామేశ్వరీ!

'అతిసారేణ మరణం యోగినామపి దుర్లభమ్' ఆ యీ జబ్బులో కొత్తి జబ్బు-చూపు చలించుట కూడా కొంత తార పించినట్లు మరలినది.

తమ మక్షివ్యాధిమాక్రమించుటకునై
   గౌదవ్యాలన్ డాఁగిరం
ధ్రమఃలవ్యేమణఁ జేయుచున్న మదురం
   డ్రాయమ్ము వార్ధక్యమెం
త మహారాజును దీని కాఱింబడుచో
   ధైర్యమ్ము కోల్పోవు నెం
త మహోన్నతుఁడు దీనికిన్ జడిసెది
   న్నా తల్లి కామేశ్వరీ!

ఆ యీ విషయమంతా పద్యాలుగా ఆ రోజులలోనే వ్రాశాను. కలసికొన్నప్పుడు వినిపింతును. శ్రీయుతులు (దిగవల్లి) శివరావుగారు వస్తారనుకొన్నాను కాని రాలేదు. ఆయన తెప్పించమన్న రికార్డు తెప్పించినాను ఇంతవరకు వారెంగినదే. ఒక పర్యాయం వారితో ముఖాముఖిని మాటలాడవలెను. ఈ జబ్బు నా ఓపికను చాలా మార్పు చేసినది-'ముదిమి రెండవ బాల్యంబు మదిదలంప' అన్న పద్యానికి ప్రత్యక్షోదాహరణంగా నున్నాను. ప్రధానం నిస్సత్తువ. సారాంశం-

ఏ యే యంగము లేపనిన్ సలుపఁగా
   నేర్పాటుగాఁ బుట్టెనో
ఆ యా యంగము లాపనిన్ సలుపకే
   మన్నాయెనో? అందులో
పాయుస్థానముపస్థలమ్ము అను నీ
(మలమూత్రస్థానములు)
   ద్వంద్వమ్ము నిర్జీవమై
స్వీయోద్యోగము మానె (రజయిను చేశాయన్న మాట. ఈ రిజయిను సంగతి 20 రోజుల నాటిది) దీని దోసురిన్
   శిక్షింపు కామేశ్వరీ!

ఇది నా ప్రస్తుతస్థితి. శివరావుగారితో చెప్పగోరినాను. వీలున్నంతలో మీ ఇరువురును రావలయును- 'క్షణక్షణముల్ జవరాండ్ర చిత్తముల్' నా జాతకం ప్రతిగ్రహదిశ మారకాన్ని సూచిస్తుంది. ఆ యోగం దీర్ఘాయువునకు సూచకము. నివృత్తియోజనస్థితిలో పట్టిన దీర్ఘాయువును సంతసించవలసియుండదు. అయినా భుక్తపలచుకొనక తప్పదుకదా!

బ్రదుకింకానగనే నెటుండను...కామేశ్వరీ!

జ్ఞానం బున్నది లేదు త్రాగుటవమున్
  కాయంబునం దెట్టులో
కానీ జీవితయాత్ర సల్పుట భవ
  చ్చంచత్కటాక్ష పథ
శ్రీనిండారుటఁ జేసి యింత దనుకన్
  జీవించితిన్ హాయిగా
పై నా భారము నీకు బెట్టితి భరిం
  పం జూడ కామేశ్వరీ!

బొత్తిగా ఓపిక లేదు. దారుణ యింకా తగ్గలేదు. తగ్గ బోలేదు. ఆహారం బొత్తిగా వెళ్ళదు. అది లేనిలోపమే చాలా వుంది.

కలిలో అన్నగతంబులందు రసముల్
  కల్యాణి! నే నోటి కిం
కిలి చూపించినదెన్నడో రొయఁగ నే
  కించిద్రసం బేదొ లో
తలి దివ్యార్తుఁడ జూపి త్వద్విభు జన
  ప్రారంభిమై కాలమున్
దొలగం జేయుచునుంటి లేవు నియమా
  దుల్ తల్లి కామేశ్వరీ!

ఏదో యిలా వ్రాస్తూవుంటే చేద స్తంగా యింకా వ్రాయవలెననే వుంటుంది.

రెండుమూడేళ్ళ నుండి అన్నమనేది బొత్తిగా ముట్టని నాకు ఈమధ్య చేసిన జబ్బు (అతిసారం) కొంత జిహ్వాచాపల్యాన్ని కలిగించినది.

లోగడ స్థితి యిది :

సురవార్ధిం బరికుప్పఁ జేసి అమృత
  ప్రోతస్సు నార్జించినా
దురదృష్టం జరిపించుకన్న నదియే
  దో మాత్రగా మాటి బల్
విరసంబో నిటువంటి వృద్ధ వన్య జీ
  వింతకన్ కటాక్షించు నీ
కరుణన్ ద్రొక్కెదనాని కై కొలుటకున్
  కంపింతు కామేశ్వరీ!

(మామిడి వూరగాయ తప్ప ఏ నిమ్మ, దబ్బ, నారింజలేనా మా యింటివద్ద నుండును గాన కొంచెంగా వీనిద్వారా పంప గోరినాను) అరుచి లోపం లేదు గాని అన్ని పదార్థాలూ వగరు(వగరని వగరూ కాదు) ఓమాదిరి రుచిలోకి మారును.

నేను ఎన్నడూ స్నానం మానలేదు. ఇట్టి నాకు ఈమధ్య చేసిన జబ్బులో అయిదారురోజులు స్నానం లేదు. ఇంత వయస్సు కాలక్షేపం కొంత బాగానే జరిగింది గాని భవిష్యత్తు గోచరించుట లేదు.

పోనీ శయ్యపయుండి మున్పటి వలెన్
  పొత్తమ్ములన్ చూచుచున్
ధ్యానమ్ముం బచరించుచున్ మనుమలన్
  లాలించుచున్ గాలమున్
బోనెట్టన్ గమనింప వందుకయినన్
  బోనీ బలంబున్నదే
స్నానంబున్ బొనరించుటన్నదియె య
  క్షంబాయె కామేశ్వరీ!

పరా : ఏదో చాలా వ్రాశాను. శివరావుగారిని కలుసుకోవాలనేది ప్రధానం. రెండవది నా జిహ్వాచాపల్యాని కేదైనా వుంటే వూరగాయలు. యిక మూడవది మనుమని గజ్జికురుపులకు మందు. ఈ వుత్తరం యిన్నిటికీ సంబంధించి వుంది. ఈ పత్రి మోపసంహారాలు నా వార్ధక్యాన్ని బలపరుచును. ఇంతే. స్వస్తి.

— వేం. శా. శతావధాని

## వార్ధక్యమునుగూర్చి మరియొక పద్యము

జరరాఁబోఁగల దందు నే నెఱిగియున్
  జర్చించ లేదింత దు
స్తర మానంచిత్రమే యేమి చెడియున్
  దైవంబు నీపాద మా
దరువున్ జూపెను, దీని నక్రమముగా
  దాటంగ నే నేర్తు శక్తి
మరలో సాగర మెట్టిదేని సుఖ
  గమ్యం బంబ! కామేశ్వరీ!

## ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్రను గూర్చి శ్రీ శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారు రచించిన పద్యాలు

వీరాస్వామి యనంగ నేనుగుల స
  ద్విఖ్యాత వంశంబునన్
ధీరోదాత్తగుణోత్తరుండు, గుణవ
  ద్ధిష్ఠుండు జన్మించి కా
శీరామేశ్వర ముఖ్యయాత్రలను సం
  సేవించి యాసేవలోఁ
జారిత్రంబును వ్రాసెనయ్యది గనన్
  సంతోషమ్మొప్పారెడిన్

(ఆ యాత్రలో అని పాఠాంతరం)

హితులతోడను తనపురోహితులతోడ
భార్యతోడను పరివారజనులతోడ
నార్వురగువారితోడను పూర్వమందు
సల్పె చెన్నపుమంత్రి యనల్పయాత్ర ॥

ఏ దినమందు నెయ్యెడల
  నెట్టి విశేషము లుప్పతిల్లెనో
యా దినమందు నయ్యది ను
  తోమహుఁడా సుధీనోత్తముఁడు ను
ర్వాదులతోడ సర్వమును
  వాడుకభాష లిఖించి పెట్టె నా
పేదయు నీడ నాచరిత
  మెంతయు సంతసమయ్యె జూచితే ॥

..వేం.శా. శతావధాని

...(౦)...

# అభ్యుదయవాదంలో శ్రీ కాట్రగడ్డ

—శ్రీ టి శ్రీరంగస్వామి

కాల్పనికత కవితలోని దేశభక్తి కవిత్వ భాగం. మానవతావాదంయొక్క గుణాత్మక పరిణామాన్ని అభ్యుదయ వాదము అంటారు. తెలుగుసాహిత్యంలో వచ్చిన పురాణ, ప్రబంధ, కాల్పనిక యుగపరిణామాలకన్నా అభ్యుదయ వాదం ఎంతో విశిష్టమైనది విప్లవాత్మకమైనది. ఇతివృత్తంలోనూ, భావనలోనూ, భాషలోనూ, ఛందస్సులోనూ, సంవిధాన శిల్పంలోనూ, తాత్వికతలోనూ పూర్తిగా కొత్తదారులు తొక్కింది.

అభ్యుదయం అన్న శబ్దానికి ప్రగతి, పురోగమనం అనే అర్థాలను నేడు స్వీకరించడం జరుగుతున్నది. అభ్యుదయవాద సాహిత్యం చైతన్యవంతమైనది. ఈ అభ్యుదయవాదమునకు పునాదులు, వాస్తవికత, సుందరత, తాత్వికత మూలంగా ఆధారపడి ఉంటాయి.

ఈ అభ్యుదయవాదమును క్రొత్త ఒరవడిలో నాందిని పలికింపచేసినవాడు శ్రీశ్రీ అని చెప్పవచ్చును. ఎందుకంటే ఆయన రాసిన కవిత "అభ్యుదయం" ఖండికలో 'అభ్యుదయం' అనే పదమును ఎలా వాడాడో చూస్తే తెలుస్తుంది. ఈ కవిత వెలువరించిన కాలం 1937 ప్రాంతం.

"ఇదే
ఈనాడే
ఈనాడే
జగమంతా బలివితర్ది
నరజాతికి పరివర్తన
నవజీవన శుభసమయం
అభ్యుదయం"

సాంప్రదాయిక వాదపరంగా కాక అభ్యుదయపరంగా మొట్టమొదటగా వాడిన వాడు శ్రీశ్రీ. ఆయన వారసత్వమును ఉటంకించుకొని అభ్యుదయ పథంలో కవితాసాధన చేస్తున్నవాడు శ్రీ కాట్రగడ్డ. ఆయన అభ్యుదయవాదమును ఊపిరిగా పోసుకున్నవాడు కాబట్టే 1988 సం॥లో ప్రత్యేకంగా 'శ్రీశ్రీ సంస్మరణిక'ను తేగలిగాడు. అందుకే శ్రీశ్రీ కవిత్వమును జీర్ణించుకొనినవాడు కావటం మూలాననే శ్రీశ్రీని గురించి శ్రీ కాట్రగడ్డగారు ఇలా అనగలిగారు.

"అస్థిరత్వ అనాగరికతకు
నాస్తికవాద స్వస్తిపలికి
అభ్యుదయాస్వాదిత
కవిత కాద్యుదయ్యో శ్రీశ్రీ"

అని అంటూ అభ్యుదయవాద కవిత్వమునకు నాంది పలికిన శ్రీశ్రీని ప్రస్తుతించడం గమనించదగిన విషయము.

శ్రీ కాట్రగడ్డగారు తన కవిత్వంలో "కేవలం అభ్యుదయవాదాన్ని వాదించి ఊరుకోనక్కండా శ్రమించి, ఆ శ్రమలో, అభ్యుదయపథంలో పురోగామివై సాగిపొమ్మంటాడు, తరతరాలకు సారధిగా నిలవ్వాలి అంటాడు. ఎండమావులలాంటి వాటికి ఆశపడకూడదని హెచ్చరిస్తాడు.

"నిలకడలేనట్టి విధికి
కేమిట గుడికట్టకేమ
వ్యక్తిత్వపు వృక్షా
వేళ్ళను నిలబెట్టగలవు
తర్యోకృత వారధిగా"

అని నమ్మకంతో నమ్మకంగా చెప్పుతాడు.

ఏ పనిచేసినా, ఏ వ్యక్తితో స్నేహం చేసినా మనకున్న మనిషిలా, నిక్కచ్చిగా, దృఢచిత్తంతో పనిచేసినప్పుడే ఆ స్నేహంగాని, వ్యక్తియొక్క వ్యక్తిత్వం గాని నాలుగు కాలాలపాటు నిలదొక్కుకుంటుంది అని అంటాడు శ్రీ కాట్రగడ్డ. కేవలం సాహిత్యసృజనతోనే కాలం గడపక తోటిసాహితీ మిత్రులతో సాహచర్యంలో తన సహచర్యమును గడుపుతూ భుజం భుజం కలుపుతూ ముందుకు నడుస్తున్నవాడు శ్రీ కాట్రగడ్డ.

"కలిమి చెలిమి లేక
కవిత చెలియ లేక
కదలదోయ్ నా బ్రతుకు
కన్నుకానన్నూ!"
"మనసులో కలుపుటకు
మాటపై నిలుచుటకు
మనిషొక్కడే చాలు
మందిలో నిండుగా"—

అనడమే కాకుండా

"ప్రజాస్వామ్యపు పాకలోని
మధువుమత్తుల నాగరికత తొత్తుల
పొరలు కమ్మిన మానవత్వపు
తెరలుతట్టి యీడ్చి వేయగ
మానవతులూ! మేల్కొండి
మానవత నే మేల్కొల్పండి"

శ్రామికులు తమ శ్రమ అంతా ధారపోసి జాతీయచైతన్యమునకు జీవధారలు

అవుతున్నారు అని అనడమే కాకుండా ఆ శ్రామికశక్తి జనజీవనమునకు ఊపిరి అని చెప్పడం వీరి ప్రత్యేకత. ఆ శ్రామికుల బలమే దేశము పారిశ్రామికముగా అభ్యుదయపథమున అడుగిడినప్పుడే ఆ దేశము అభ్యుదయములో పయనించి ప్రపంచదేశములలో పురోగామిగా జయనిస్తుంది. ఆ పురోగామి పథములో ఆ దేశముయొక్కయు, ఆ దేశములోని శ్రామికులయొక్కయు శక్తిని గుర్తించినప్పుడు ఆ శ్రామిక చైతన్యం అధికారంలో దేశము పయనిస్తుంది అని అభ్యుదయ పరపతియందు చెప్తున్నారిలా—

"శక్తి చిందిన రక్తమంతా
జనుల పరమని చాటిచేతుము
శ్రమజీవన చలన మిత్తుము
సుఖపడేందుకు తరలివత్తుము
బడులు మావి గుడులు మావి
బడుగువర్గపు మడులు మావి
అరుపు మాది అడుగు మాది
అధికారమంతా నేడు మాదే!

అని చాటిచెప్పవచ్చునని ఘంటాపథంగా ఈయన చెప్తున్నారు.

మన భారతదేశంలో కాకుండా, ప్రపంచవ్యవస్థలోనే తరతరాలుగా వెర్రితలలు వేస్తూ మారణహోమాలకు కారణభూతమవుతున్న బలీయరాక్షసి 'కులం'. కులాభిమానం ఎంతటి స్వార్థానికైనా, నీచానికైనా దిగజారుస్తుంది. కులమత పోరాటాలపై ధ్వజం ఏ అభ్యుదయ భావాలు కలిగిన కవికైనా సహజము అయిన విషయమే.

కులమత రాద్ధాంతాలపై తిరుగుబాటును ప్రదర్శిస్తూ ఈ మతమౌఢ్యంలో కొట్టుకుపోవడం అనేది మంచిది కాదు. మానవ సమాజంలో మానవులందరూ ఒకటే, హిందూ, ముస్లిం, క్రిస్టియన్ అంతా ఒకటే, అంటరానివారు అనేవారు ఎవరూ లేరు అని అంటున్నారు.

"మంచియున్నది మాల అయితే
మే మాలనే అగుదు .." నన్న గురజాడ మహాకవిని గుర్తుకెస్తారు శ్రీ కాట్రగడ్డ గారు ఈ వాక్యాలతో.

"పురజనులలో నున్న
హరిజనులు ఎవరురా!
పల్లెసీమల బ్రతుకు
పాలకులు ఎవరురా?
విశ్వాన ఇను దేవులమురా పెద్దన్నా?
సంద్రాన సకిలించు గాలివుత లేమిరా
చిన్నన్నా?"

శ్రీ కాట్రగడ్డ లక్ష్మీనరసింహారావు గారు తన కవిత్వ చేతనత్వములో అడుగడుగున అభ్యుదయపథుడై ముందుకు నడుస్తాడు. ఆయన తన ఇరవైమూడవ ఏటనే (1964 ప్రాంతం) ఇలా స్వాగతించాడు.

"హాలాలుకట్టుక పొలాలుదున్నే
కలాలుపట్టుక.....దున్నే
రైతుల్లారా, రచయితల్లారా
ముందున్నది, మీముందున్నది లోకం"

అని. ఎందుకంటే తను చూసే భావనలో, చూపులో ముందుచూపు ఉండాలి అని చెప్పడమే కాదు, మీరంతా గ్రహించండి అని కోరడంకూడా జరుగుతున్నది ఇందులో.

అభ్యుదయము, అభ్యుదయము అని అరచినంతమాత్రాన అభ్యుదయం పరుగెత్తుకొని రాదు ఆ అభ్యుదయంరాకుండా అడ్డుకట్టవేసేందుకు ఎంతోమంది ప్రయత్నిస్తుంటారు ఆ అభ్యుదయవాదులపై ధ్వజం ఎత్తుతాడు శ్రీ కాట్రగడ్డగారు. ఆయన కలంలోని వాడి వేడి ఇందులో మనకు స్పష్టంగా కనిపిస్తుంది.

"ప్రజకాల్లెడ పంచేందుకు
జీవగడ్డ చైతన్యం
జాతిజనం పెంచేందుకు
శ్రమజీవన ప్రాంగణాన
చేయిచేయి కలిపేందుకు
వస్తున్నా! వస్తున్నా! వచ్చేస్తున్నా!!

అంతేకాదు......

"శాంతిస్వర మురళిలో
ప్రగతిపాట పాడేందుకు
చింతలేని లోకాన
ప్రజలెల్లెడ మసలేందుకు
సంకేగంట మ్రోగిస్తూ
దండోరా వేస్తున్నా
దండోరా వేస్తున్నా
రండర్రా! రండి! రండి
సమతాశ్రయ వనానికి..."

అంటూ అభ్యుదయవాదికకు మార్గం వేసి ఆహ్వానించడం శ్రీ కాట్రగడ్డకే తగింది.

"ఇలకోయిలా కృతి కూసినా
కోటికాంతుల భావ లోకటగు
జనహర్ష జీవితా లోకటగు"

భుజం, భుజం కలిపి ముందుకు నడిస్తే జనజీవితాలు సంతోషాతిరేకంతో సాగుతాయని అంటారు. అలాగే ఇరు హృదయాలు ఒకటైతే ఎదురులేదని చెప్తారు.

"రెండుచేతులు కలిసినప్పుడు
ఎంత చప్పుడు స్ఫురిస్తుందో
రెండుమాటలు కలిసినప్పుడు
ఎంత భావం ధ్వనిస్తుందో
రెండువిధములు కలిసినప్పుడు
మూలప్రాణం జయిస్తుంది
ఎండమావుల జీవితమ్మును
మూఢభక్తి నశిస్తుంది"

అభ్యుదయకవితా ధురీణ శ్రీ కాట్రగడ్డ గారు నిర్ద్వంద్వంగా మ్రోగిస్తున్నారు. ఈయన ప్రతిపదంలో అభ్యుదయసుగంధాలు మనను ఆఘ్రాణింపచేస్తాయి. అనడానికి సందేహం లేదు.

---

# బాపిరాజు సాహిత్యం : మనస్తత్వ విశ్లేషణ

—డా వి. సిమ్మన్న

మనస్తత్వ శాస్త్రంలో విప్లవాత్మక మార్పులకు కారకుడైన సిగ్మండ్ ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతాలకు ఆద్యుడు, ఆరాధ్యుడు. ఫ్రాయిడ్ అనే జర్మన్ శాస్త్రవేత్త ఈ మనోవిశ్లేషణను మొట్టమొదటిసారిగా ప్రపంచానికి చాటి చెప్పాడు. మానసిక పరిణామాలకు కారణాల్ని కనుగొనుటయే మనోవిశ్లేషణ అని విపులంగా వివరించాడు ఫ్రాయిడ్.

తెలుగు సాహిత్యాన్ని బాపిరాజుగారి నవలలు, కథలు సుసంపన్నం చేశాయి. వీరి నవలలు, కథలు ఇటు సాహిత్యలోకం లోను, అటు సమాజంలోను ఎనలేని ప్రాముఖ్యతను సంతరించుకున్నాయి. వీరు సాంఘిక చారిత్రాత్మక నవలలు వ్రాశారు. ప్రత్యేకంగా మనస్తత్వ విశ్లేషణ ప్రధానమైన నవలలు, కథలు వ్రాయకపోయినా, మనస్తత్వశాస్త్ర సిద్ధాంతాలను గురించి అవగాహన వీరి సాహిత్యంలో కనబడుతుంది. వీరి నవలల్లో, కథల్లో ప్రతి పంక్తి మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తుంది.

బాపిరాజుగారి మంచి నవలల్లో తుపాను ఒకటి. తుపాను నవలలో శ్రీనాథమూర్తి వలచి, ప్రేమించి, ఆరాధించిన దేవత శకుంతల హఠాన్మరణంతో తీవ్రమైన మానసిక సంక్షోభానికి గురిఅవుతాడు. మనశ్శాంతికోసం తల్లిని తోడు తీసుకొని కాశీయాత్ర బయలుదేరు తాడు. ఈ కాశీయాత్ర శ్రీనాథమూర్తికి ఆధ్యాత్మికచింతన కాక, దేవుని పట్ల కసిని పెంచుతుంది. తన ప్రేయసిని తనకు కాకుండా చేసిన భగవంతునిమీద కసి పెంచుకుంటాడు శ్రీనాథమూర్తి. నీతినియమాలకు తిలోదకాలిచ్చి అక్రమ పద్ధతిలో స్త్రీవాంఛను తీర్చుకోవడమే మార్గమని అనుకుంటాడు శ్రీనాథ మూర్తిలో నిబిడీకృతమైన కామదాహమే ఈ రూపంలో అతనిని ఆత్మవంచనకు ప్రోత్సహించిందని చెప్పవచ్చు.

కామపీడితుడైన శ్రీనాథమూర్తి ఒక నాడు భోగంవాళ్ళ యింటికి వెళ్ళి డబ్బు యిచ్చి ఏం చెయ్యకుండానే వచ్చేస్తాడు. కాశీలోనే ఒక 'పండా' భార్య సుశీలతో శ్రీనాథమూర్తికి పరిచయం ఏర్పడుతుంది. కాని ఆమెతో శారీరకసంబంధం పెట్టుకోడు. సుశీల బాధపడుతుంది. శ్రీనాథ మూర్తి కామానికి శకుంతల స్మృతి అడ్డుగోడ వేస్తుంది.

ఒక్కొక్కప్పుడు శ్రీనాథమూర్తి తనలోని కామాన్ని అణచుకోలేక కాశీ యాత్ర చేస్తూ అందమైన అతివల్ని చూస్తూ మనఃపూర్తిగా సంతోషిస్తూ ఉండేవాడు. "ఎన్ని వస్త్రాలు ధరించిన జవ్వనినైనా మనసులో వివస్త్రను చేసి ఊహిస్తూ తన పిరికితనానికి, పళ్ళు కొరుక్కుంటూ ఉండేవాడు" మరియు స్నాన ఘట్టాల దగ్గర పొంచివుండి అందమైన సుందరాంగుల నగ్న సౌందర్యాన్ని కసితీరా చూచి మానసిక ఆనందం పొందేవాడు.

శ్రీనాథమూర్తిలో శకుంతల స్మృతికీ, తన శరీరం కోరే సుఖానికీ మధ్య జరిగిన తీవ్రమైన సంఘర్షణను రచయిత 'తుపాను' నవలలో ఎంతో అతిచక్కగా చిత్రీకరించాడు. శ్రీనాథమూర్తిలోని సంఘర్షణను 'లిబిడో' లోని భావాలకు, 'సూపర్ ఇగో' ద్వారా ఉత్పన్నమయ్యే భావాలకు మధ్య సంఘర్షణగా చెప్పుకో వచ్చు. ఈ నవలలో మానసిక సంఘర్షణల్ని బాపిరాజుగారు అపురూపంగా చూపిస్తారు శ్రీనాథమూర్తి పాత్రచిత్రణే ఇందుకు చక్కని ఉదాహరణ.

"శ్రీనాథమూర్తి కథలో మనస్తత్వ శాస్త్రంలో చెప్పబడే అనేక విషయాల అన్వయం కనబడుతుంది. శ్రీనాథమూర్తి శకుంతల ధరించిన అంగాల్ని, బాడీల్ని తన పెట్టెలో వుంచుకోవడమూ వాటిని ముద్దు పెట్టుకోవడమూ *Fetishism* ను జ్ఞాపకానికి తెస్తే, తనను తాను హింసించుకొనే ధోరణిలో శ్రీనాథమూర్తి దేవుళ్ళమీద పగ తీర్చుకోవాలనుకోవడం *Masochistic sabotage* ని, జ్ఞాపకానికి తెస్తుంది".

హేమకుసుమాకుమారి శ్రీనాథ మూర్తిని ప్రేమించి పెళ్ళిచేసుకోవాలని అనుకుంటుంది. పెళ్ళిఅంటే ఆమెకు ఇష్టముండదు. అందుచేత తీర్థమిత్రుడితో లేచిపోతుంది. ఆమెలో పాతుకుపోయిన సనాతన భారతీయకర్తవ్యం అందుకు అంగీ

రించదు. తత్కారణంగా తీర్థమిత్రుణ్ణి మార్గమధ్యంలో వదిలివేసి తన యింటికి వెళ్ళిపోయి ప్రేమించిన శ్రీనాథమూర్తిని వివాహం చేసుకుంటుంది.

స్వేచ్ఛాప్రణయ సిద్ధాంతానికీ, సంప్రదాయానికీ మధ్య జరిగిన సంఘర్షణను రచయిత చక్కగా చిత్రీకరించారు. చివరకు బాపిరాజుగారు సంప్రదాయానికి ప్రాముఖ్యం ఇచ్చారు.

శ్రీనాథమూర్తి, హేమకుసుమా సుందరి పాత్రల మనస్తత్వాన్ని లోతుగా తరచి తరచి పరిశీలించారు రచయిత.

అడివి 'కాంతిశ్రీ' నవలలో కాంతిశ్రీ అపురూపపు సౌందర్యవతి. ఆమెకు పురుషులపట్ల మోజు వుండదు. మరియూ వివాహం, సంసారజీవితం పట్ల ఆసక్తి వుండదు. చిన్నతనంనుంచీ కాంతిశ్రీ మనస్తత్వం అలాంటిది. "ఆమె అద్దాలనాటి నుండి నవ్వి ఎరుగదు. మహారాజు ఎన్ని విచిత్రాలయిన ఆటవస్తువులు యిచ్చినా, ఆ బాలికలో ఏమీ మార్పువచ్చేది కాదు. చీనాంబరాలు కట్టి, ముద్దులొలికే బట్టలు ధరింపచేసినా, కాంతిశ్రీలో ఏమియూ సమ్మోదము లేదు. ఆమెకు నగలు ధరించాలనే యిచ్ఛ కాదు" ఇటువంటి మనస్తత్వంగల కాంతిశ్రీని బ్రహ్మదత్తుడు తన ప్రేమలోకానికి దింపి ఆదర్శమహిళగా తీర్చిదిద్దుతాడు. రచయిత ఈ నవలలో పాత్రల మనస్తత్వాన్ని చక్కగా చిత్రీకరించారు.

'నారాయణరావు' నవల ఫ్రాయిడ్ ప్రణాళికకు, వాస్తవికతకు ఓ రకంగా 'అభావప్రవర్తనం' అని ఆరిపిరాలవిశ్వం అభిప్రాయపడ్డారు.

వీరు సాంఘిక, చారిత్రాత్మక, కాల్పనిక కథలు వ్రాశారు. వీరు సృష్టించిన పాత్రల స్వభావం సమాజంలోని వ్యక్తుల మనస్తత్వానికి అద్దం పడుతోంది.

'భోగీరలోయ' కథలో జోగ్యశాన్హప్రియ శిల్పాచార్యులకు స్త్రీ అంటే చిన్నచూపు. వారికి విద్య నేర్పడం అతని నియమానికి వ్యతిరేకం. సుపీరియారిటీ కాంప్లెక్స్ భావాలు కలిగిన మనస్తత్వం జోగ్యశాన్హప్రియ శిల్పాచార్యులది. ఈ భావాలన్నీ కల్హారమాల సంపూర్ణ ప్రేమతత్త్వంద్వారా పటాపంచ అవుతాయి.

'నరపతి' కథలో నరపతి మనస్తత్వం చిత్రమైంది. తాను పురుషుడననే అహంభావం నరపతికి ఉంటుంది. ఆకారణంగా స్త్రీ అంటే అసహ్యించుకుంటాడు. పైగా పెళ్ళికూడా చేసుకోడు. చివరకు అందమైన సుందరాంగిద్వారా నరపతిలో ఉన్న సుపీరియారిటీ కాంప్లెక్స్ భావాలు క్రమేపి తగ్గడమే కాకుండా స్త్రీపై ద్వేషంపోయి ప్రేమమూర్తిగా మారుతాడు.

'మెట్లు' కథలో మాచమ్మ తనకు అందం లేదని, డబ్బులేదని, చదువులేదని మాలకులానికి చెందినదాన నని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుకు లోనవుతుంది. ఆమె న్యూనతాభావంద్వారా క్రుంగిపోకుండా 'కాంపెన్సేటివ్ యాక్టివిటీ' అధికృతను ఊహించుకొని ఉన్నత విద్యల్ని అభ్యసించి, మాచమాంబ అని పేరు మార్చుకొని డా. రావును పెళ్ళి చేసుకొని తాను అనుకొన్న పని సాధిస్తుంది.

'తూలికానృత్యం' కథలో పద్మప్రియ బ్రహ్మమూర్తిని ప్రేమిస్తుంది. ఆ విషయాన్ని బ్రహ్మమూర్తితో చెప్పడం ఆమెకు సిగ్గు. ఆమె సిగ్గుకు కారణం ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సే. చివరకు పద్మప్రియ మనోధైర్యంతో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుపోగొట్టుకొని బ్రహ్మమూర్తితో 'నా మనసు మీకు అర్పించుకొంటూన్నాను' అని అంటుంది. ఈ విధంగా పద్మప్రియ తనలోని న్యూనతాభావాల్ని పైకి నెట్టివేయడంతో తన గమ్యస్థానాన్ని చేరుకుంటుంది.

'హిమాలయ రశ్మి' కథలో రామానందలాల్ మనస్తత్వం ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ భావాల సమ్మేళనం. అతని అంతరంగంలో జరిగే కల్లోలాన్ని ఉన్నది ఉన్నట్లు మన ముందు ఉంచుతాడు రచయిత.

"నరసన్న మా అన్నయ్య దద్రోర్వరం గుడిలోకి రాకోతుంటే చావవాదు తాడు". రమణ అనే ఈవాక్యాన్ని రచయిత అనేకసార్లు 'నరసన్న పాపాయి' కథలో చెప్పిస్తూ రమణ అన్న కవిత మనస్తత్వాన్ని వ్యక్తంచేస్తాడు. ఈ కథలో రమణ, మానసిక సంఘర్షణను చక్కగా చిత్రీకరించారు.

ఒక విధవరాలి మనస్తత్వచిత్రణ ప్రధాన ఇతివృత్తంగా వ్రాయబడిన కథ 'దీపావళి'. ఈ కథలో విధవ ఆడపడుచు మనోగతిని, ఆమెలో చెలరేగిన సంఘర్షణను ఎంతో చక్కగా చిత్రీకరించారు.

'అనుబింపుడు' కథలో అపురూపపు సౌందర్యవతి అయిన సినిమా తారకు, బిచ్చమెత్తుకొని బ్రతికే బిచ్చకత్తెకు మధ్య ఉన్న తేడాల్ని వారి మనః ప్రవృత్తుల్ని వివరిస్తారు.

'కన్ని' కథలో కన్నిను కొందరు ధనవంతులు తమ పశుత్వ ఆకలిని తీర్చుకోవడం కోసం తమ ప్రక్కలపైకి రమ్మం

టారు. కన్ని నిరాకరిస్తుంది. మృత్యుశాస్త్ర కళంకం తొలగక నిర్బంధములోంటారా కాని మోహాభిమానాల్ని అమ్ముకోరని అపాయం చేయడానికి కన్ని మన సత్వం చక్కని తార్కాణం. ఈ కథలో కన్ని అచేతనను రచయిత చిత్రించిన తీరు అత్యంత ప్రశంసనీయమైనది.

కలలుకూడా మనోవిశ్లేషణతో సంబంధించినవే. ఈ కలల్ని మనోవైజ్ఞానిక శాస్త్రవేత్త ఆడ్లర్ రెండు రకాలుగా విభజించారు. 1. విషాదకలలు, సఫరింగ్ డ్రీమ్స్; 2. విజేత కలలు, కాంకరింగ్ డ్రీమ్స్.

'సూర్యముఖి', 'సోమనాథ' కథల్లో తన ఊహాప్రపంచాన్ని సృష్టించుకున్నాడు రచయిత. ఈ రెండు కథల్లోనూ ప్రధానపాత్ర రచయితే. ఈ ఊహాగానాలన్నింటి వెనకా బాపిరాజుగారిలోని అచేతనలో అణచివేయబడిన భావాలు కన్పిస్తాయి.

'కొండపైన కోనలు కొండక్రింద కోనలు' కథలో నరసింహాచారి కోనేరునను స్త్రీగా భావించి 'అక్కా' అని సంబోధిస్తూ మాటలాడుతాడు. నరసింహాచారి మన సత్వంకూడా కలలతో సంబంధించిందే.

'లచ్చిమి' కథలో పచ్చులయ్య పొలాన్ని అందమైన కుమార్తెగా భావించి ఆ పొలానికి లచ్చిమి అని పేరు పెట్టడం, పెద్దదయిందని, వయస్సు వచ్చిందని, పెళ్ళిచేయాలని మథనపడతాడు. పొలం లచ్చిమితో పచ్చులయ్య సోమన్నలు మాటలాడడం, వారితో పొలం లచ్చిమి మాటలాడడం_ ఇలా ఈ కలలన్నీ చేతనలో పచ్చులయ్యలోని భావాల్ని అతని ఆకల్ని ఆశయాల్ని తెలుపుతున్నాయి. అందుచేత పచ్చులయ్య మనస్తత్వం కలలకు సంబంధించినదిగా గ్రహించవచ్చు.

సూర్యముఖి, సోమనాథ, శైలబాల, కొండపైన కోనలు కొండక్రింద కోనలు, లచ్చిమి మొదలగు కథలన్నీ కాంకరింగ్ డ్రీమ్స్‌కి సంబంధించినవే.

అచేతనలో ఉన్న భావాలు కలలలో బాగా మనకు కనబడతాయి. కలలవల్ల మనద్వారా చేతనలోని భావాలకు అచేతనలోని భావాలకు మధ్య జరిగే సంఘర్షణను రచయిత ఆవిష్కరించడానికి ప్రయత్నిస్తాడు.

ఈ విధంగా బాపిరాజుగారు తన సాహిత్యంలో మానవ మనస్తత్వాన్ని విశ్లేషించి చూపుతారు.

### ఆధార గ్రంథాలు–వ్యాసాలు


1. తెలుగు నవలా సాహిత్యంలో మనోవిశ్లేషణ – కోడూరి శ్రీరామమూర్తి.
2. తెలుగు నవల – మనోవిశ్లేషణ – డి. సిద్ధేశ్వరి.
3. మనోవిశ్లేషణ · స్వరూప స్వభావాలు – భారతి, 1946.
4. మనోవిశ్లేషణ సిగ్మండ్ ఫ్రాయిడ్ – మధుసూదనరెడ్డి, తెలుగు త్రైమాసిక వైజ్ఞానిక పత్రిక, ఏప్రియల్–జూన్, 1972.
5. తెలుగు నవల : మనోవిశ్లేషణ – తెలుగు నవల నూరు సంవత్సరాలు – డా. అరిపిరాల విశ్వం.
6. తెలుగు నవల : మనోవైజ్ఞానికత; తెలుగు నవలావికాసం – [illegible] నాగభూషణ శర్మ
7. తెలుగు కథానిక: మనోవిశ్లేషణం; మహతి – వాకాటి పాండురంగారావు.
8. తెలుగు కథ : మనోవిశ్లేషణ – కోడూరి శ్రీరామమూర్తి, ఆంధ్రజ్యోతి, ఆదివారం, సెప్టెంబరు 9. 1984.


... — ...

## పికగీతి

—శ్రీ పోలిపెద్ది రాధాకృష్ణమూర్తి, ఎం.ఏ., ఎం.ఫిల్.

విభవసంవత్సరారంభ వేళ యందు
మావి కొమ్మల గుబురుల మాటునుండి
యీ జనాళికి సందేశ మిచ్చు రీతి
కోకి లొక్కటి కమ్మగా గూయసాగె.

తమ్ముడా! యుగాది ప్రమోదమ్ము వోలె
జాడ నీజీవితము కష్టసుఖమయమ్ము;
భయము జెందక భరియించవలయునోయి!
యనుచు గొంతెత్తిపాడె నుగాది పికము.

ఎగురుచున్నావు గాలిలో ఖగమువోలె,
జలములో నీదుచున్నావు ఝషమువోలె,
మట్టిపై మానవునివోలె మనగలేవ ?
యనుచు గొంతెత్తిపాడె నుగాది పికము.

శాస్త్రవేత్తల విజ్ఞాన జలధినుండి
యవని గాల్చెడు నణ్వాయుధాగ్నికీల
లవతరించు టకాంచనే యమ్మ కరము
అనుచు గొంతెత్తిపాడె నుగాది పికము.

జాతి కుల మత వైరాలు సమసిపోయి
యెల్లలోకమ్ము లొక్కటయిల్లె యటంచు
బంధుభావమ్ముతో ప్రజ బ్రతుకవలయు
ననుచు గొంతెత్తిపాడె నుగాది పికము.

కడచిపోయిన వెన్నోయుగాదు లిటులె
ఆలపించుచు నుండె పికాళి మాత్ర
దేశ కల్యాణ దివ్యసందేశ పూర్ణ
మధుర గానము విరము తన్మయత మీరు.



సకల ఫలంబులం గుఱియు జంగమతీర్థము లెందు బ్రాహ్మణ
ప్రకరము లట్లుగాక పెదవాయుట యొల్లు తదీయభాషణో
దకములు సేవకావళికిఁ దత్క్షణమాత్రన జన్మజన్మ బం
ధకత సహాగతంబులగు తత్తదనేక మహాఘసంఘముల్.

వినుఁ డనయంబు గోవులఁ బవిత్రము గోవులు మంగళంబు త
ద్ఘన ఖుర టంక శృంగ పరిఘట్ట దళ ద్ధరణీ రజశ్ఛటల్
కనుకని నప్పుచుండుఁ బరఘస్మర మూర్ధజటాటవీ నట
ద్ఘన పథ సింధువార్లహరి గర్వభరార్భటిఁ బావనోన్నతిన్.

— శ్రీనాథుడు



సమాలోచన 3,4,5,6,7,8,9,10 వార్షిక సంపుటముల వెల వరుసగా 20, 20,12,15,15,15,15,20 రు. లు ఎం. ఓ. చేసినవారికి ఖర్చులు మేమే భరించి రిజిష్టర్డు పోస్టులో పంపగలము. వి. పి. పద్ధతి లేదు.

— సంపాదకుడు.

ప్రతికు :—
సంపాదకుడు : విద్వాన్ బులుసు సీతారామశాస్త్రి
రిటైర్డు తెలుగు లెక్చరరు, వి. టి. జె. కాలేజి,
6-4-34, ఇన్నీసుపేట (త్యాగరాజనగర్),
రాజమండ్రి-1.

Editor, Printer and Publisher B. Sitharama Sastry, Printed at B. V. & Co., Press, Innisepeta, Tyagaraja Nagar, Rajahmundry-1.